# ఇక్బాల్
## కవితలు




తెలుగుసేత

బెజవాడ గోపాలరెడ్డి

# అల్లామ ఇక్బాల్

## కవితలు

జవాహర్‌లాల్ నెహ్రూ

**1989**

శతజయంతి సంవత్సరం

తెలుగుసేత :

**బెజవాడ గోపాలరెడ్డి**

ALLA MA IQBAL
KAVITALU



Iqbal's Poems rendered
into Telugu by
**Dr. B. Gopala Reddi**



ప్రథమ ముద్రణ ఆగస్టు, 1989
ముఖచిత్రం: అమర్



వెల: రూ. 12/-

ప్రతులకు;
ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్, హైదరాబాదు-1

ముద్రణ:
శివాజీ ప్రెస్,
4-4-53, గంజ్ బజార్,
సికింద్రాబాద్.

# గ్రంథకర్త జీవన వివరాలు

| | |
|---|---|
| జననము : | 5 ఆగస్టు, 1907<br>బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు జిల్లా.<br>తండ్రి—పట్టాభిరామిరెడ్డి<br>తల్లి—సీతమ్మ. |
| చదువు : | బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు<br>ఆంధ్ర జాతీయ కళాశాల<br>(1921—24).<br>విశ్వభారతి, శాంతినికేతన్<br>(1924—27). |
| సమర పర్వము : | సర్కారుబడి వదులుట—జనవరి 1921.<br>జైలు శిక్షలు—ఆరుమారులు.<br>1930, 31, 32, 33 లోను,<br>1940, 41, 42, 43 లోను<br>కొంతకాలం జైలులో ఉండినారు. దాదాపు<br>4 సం॥లు జైలులో మకాం. ఎ.బి.సి. క్లాసుల<br>ఖైదీగా, డెటెన్యూగా. |
| ఉద్యోగ పర్వము : | మద్రాసులో 86 మాసాలు<br>కర్నూలులో 19 మాసాలు<br>(ఆంధ్ర ముఖ్యమంత్రిగా)<br>హైదరాబాదులో 16 మాసాలు<br>(ఆంధ్రప్రదేశ్ మంత్రిగా)<br>కేంద్రమంత్రిగా 66 మాసాలు<br>ఉత్తర్‌ప్రదేశ్‌లో గవర్నరుగా 62 మాసాలు<br>ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రో—ఛాన్సలర్‌గా—<br>జూన్ 1951 నుండి 72 మాసాలు |
| సాహిత్య పర్వము : | తెలుగు భాషాసమితి అధ్యక్షత 1948—86 వరకు<br>ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షత—<br>అగస్టు 57 నుండి డిసెంబరు 1982 వరకు<br>కేంద్ర సాహిత్య అకాడమీ (రెండవ తూరి)<br>జనవరి 78—జనవరి 88<br>జ్ఞానపీఠము 1963—71 |

# బెజవాడ గోపాలరెడ్డి పుస్తకాలు

ముక్తకాలు

1. ఆమె (1978)
2. ఆమె జాడలు (1981)
3. ఆమె నీడలు (1981)
4. ఆమె తళుకులు (1982)
5. ఆమె చెణుకులు (1983)
6. స్ఫులింగాలు—తుషారాలు (1984)
7. స్వప్న హారము
   వీచికలతో సహా (1986)
8. దీపికలు (1988)
9. కళికలు (1989)

దీర్ఘ కవితలు

1. కాలవాహిని (1979)
2. సాహిత్య సుందరి (80)
3. ప్రసూన మంజరి (81)
4 పరిమళ తరంగాలు (82)
5. సాగర సమీరాలు (83)
6. మలయ మారుతాలు (85)
7. సౌరభ నీరాజనాలు (87)

అనువాదాలు

1. గాలిబ్ ప్రేమ శతకము
   ఇక్బాల్ ఆత్మ శతకము (89)
2. అల్లామ ఇక్బాల్ కవితలు (1989)

రానున్నవి

1. ఫిర్యాదు—జవాబు (ఇక్బాల్)

సొంతాలు

1. శశాంక రేఖలు
2. గులాబి రేకులు
3. హంస తూలికలు

# నివేదన

అల్లామా సర్‌మహమ్మద్ ఇక్బాల్ సియాల్‌కోటలో 22 ఫిబ్రవరి 1873 లో జన్మించెను. లాహోర్‌లోను ఇంగ్లాండులోను చదివి, కడకు బెర్లిన్ విశ్వవిద్యాలయములో డాక్టరేటు పొందెను.

తొలుత పంజాబీలో కవితలు వ్రాసి, అది వదలి పెట్టి ఉర్దూ, పర్షియన్ భాషలలో రచించెను. బారిస్టర్‌గా వృత్తి సలుపుచు, పెద్ద భావుకుడుగా, కవిగా పేరుపొందెను. బ్రిటిష్ సర్కారు సర్ బిరుదమును ఇచ్చి సత్కరించెను. హైదరాబాదును రెండు పర్యాయములు దర్శించెను. 1937 లో కాబోలు జవాహర్‌లాల్ నెహ్రూను పిలిపించుకొని చాల మాట్లాడినారు. నెహ్రూ ఆయన కవితలను ప్రశంసించినారు. సెలవు తీసికొని వచ్చేటప్పుడు "మీకూ జిన్నాకు పోలిక ఎక్కడిది? అతడొక రాజకీయవేత్త, మీరు దేశభక్తులు'' అన్నాడు ఇక్బాల్.

హైదరాబాదులో 1938 జనవరి 7న ఇక్బాల్ దినోత్సవం జరిగింది. నిజాం యువరాజు అజంజాహ బహద్దురు అధ్యక్షత వహించిరి. అక్బర్ హైదరీ పాల్గొనిరి. పై సభకు వచ్చిన సందేశాలు చూడండి:

''భారతదేశ మహాకవి ఇక్బాల్ ఉత్సవాన్ని నిర్వహిస్తూ మీరుపొందుచున్న అనందములో నేను పాల్గొంటున్నాను. ఫారసీ, ఉర్దూలలో పరిచయంలేని కారణాన, ఇక్బాల్ వంటి మహాకవి కవితా సౌందర్యాలను దర్శించలేక పోయాననే విచారం నాకు జీవితాంతం ఉంటుంది. భగవంతుడు జాతిని, దేశాన్ని సేవించడానికి ఆయనను సజీవముగాను, సురక్షితంగాను ఉంచాలని కోరుకొంటున్నాను''—రవీంద్రనాథ్ టాగూర్.

"నేను నా ఉత్తమ స్నేహితుడు ఇక్బాల్‌ను మహా కవిగా భావిస్తాను. ఈ కవి ఉర్దూ, ఫారసీ కవితలు భారతజాతికి నేతృత్వాన్ని, మార్గదర్శకత్వాన్ని ప్రసాదిస్తాయి" — శ్రీమతి సరోజినీ నాయుడు.

"నేటితరం ఇక్బాల్ గీతాలతో అత్యంత ప్రభావితమైందనే యాథార్థ్యాన్ని కాదనలేము. భగవద్దత్తమైన ఇక్బాల్ ప్రతిభా సామర్థ్యాలతో ప్రతివ్యక్తి పరిచితుడే. ఇక్బాల్ ఉత్సవం విజయవంతం కావాలని ఆశిస్తూ ఆనందాన్ని ప్రకటిస్తున్నాను''— జవహర్‌లాల్ నెహ్రూ.*

---

* తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురించిన 'జాతీయకవి ఇక్బాల్' అను బర్నీ అనువాదము మిత్రులు డాక్టరు ఇరివెంటి కృష్ణమూర్తి చేసిన గ్రంథము నుండి.

కడకు లాహోర్‌లోనే 1938 ఏప్రెల్ 21 న ఇక్బాల్ స్వర్గస్థులైరి. గాంధీజీ ఒక సందేశములో ఏమన్నారో చిత్తగించండి:

"స్వర్గీయ ఇక్బాల్‌ను గురించి ఏమి వ్రాయను? కాని ఇంతమాత్రం అనగలను. ఆయన ప్రసిద్ధగీతం 'హిందూస్థాన్‌హమారా' చదివినప్పుడు నాహృదయం ఉప్పొంగిపోయింది. బరోడా జైలులో కొన్నివందల సారులు ఈ గీతాన్ని నేను పాడుకొని ఉంటాను. ఈ గీతంలోని పదాలు నా కెంతో మధురముగా తోచినవి. ఈ లేఖ వ్రాస్తున్నప్పుడు కూడ ఆ గీతం నా చెవుల్లో గింగురు మంటూనే ఉంది"

రవీంద్రుని సందేశము కూడ గమనించండి :

'The death of Sir Mahammad Iqbal created a void in literature that like a mortal wound will take a long time to heal. India whose place in the world is too narrow can ill-afford to miss a poet whose poetry had such universal value.

## II

ఇక ప్రస్తుతాంశం 1977 లో నేను ప్రచురించిన అనువాదములకు మరి కొన్ని కవితలు చేర్చి, ఈ గ్రంథాన్ని ప్రకటించుచున్నాను. మొదటి నాలుగు దేశభక్తి పూరితములైనవి. మొదటిది విశేష ప్రచారాన్ని పొందింది. గాంధిజీ దానిని గూర్చి ఏమన్నారో చూచారు గదా !

1. మనలో మనము పోరుటను
మతములు నేర్పలేదు
భారతీయులము మనము
దేశము మనది హిందూస్థానము

2. భగవంతుడు దేని మట్టికి
స్వర్గప్రభావము కలిగించెనో
నా దేశము అదే, నా దేశము అదే.
ఏ మహీతల వాతావరణములో వసించుట
స్వర్గలోక జీవిత మగునో
నాదేశము అదే, నాదేశము అదే.

3. క్రొత్త శివాలయము : అతని సాహిత్యములో ప్రసిద్ధి చెందినదే.
నీవు శిలామూర్తులలో
దేవు డున్నాడని తలచితివి.
దేశధూళి అణువు అణువునందును
నాకు దేవుడు కాన్పించును.

4. తన చిన్నికుమారునికి ఎట్టి సందేశము నిచ్చెనో చూడండి.

భారత వర్షపు మట్టితోనే
నీ కూజా పాత్రలు సృష్టించుకో !

ఆత్మను అమ్ముకోవద్దు—
పేదరికములోనే పేరును సృష్టించుకో.

5వ, 6వ, 7వ, 8వ కవితలు హిందూ ధర్మమునకు సంబంధించినవి :

5. రాముని చరిత్ర
హిందూస్థానమునకు వైభవ కారణము.

కరవాలములో భాగ్యవంతుడు
శౌర్యములో మహావీరుడు
పవిత్రతలో, ప్రేమానురాగములలో
మహా మానవుడు.

6. గౌతముని దీపము
పర సభలలో వెలుగుచున్నది.

కడకు తిరుగ ఏకేశ్వరుని వాణి
పంజాబు నుండి ధ్వనిత మాయెను.
స్వప్నముల నుండి హిందూస్థానమును
ఒక పూర్ణ పురుషుడు మేల్కొలిపెను.

9. సాఖీ :

నీ వినోదాలతో సల్లాపాలతో
రాత్రి గడిచిపోయినది
ప్రాతఃకాలము సమీపించుచున్నది
అల్లాపేరును స్మరించుకో !

ఐదు నమాజులలో మొదటిది సూర్యోదయమునకు పూర్వమే చేయవలెనని సాఖీకి చెప్పుచున్నాడు. 10, 11 ప్రసిద్ధులైన కవులమీద రచించిన శోక కవితలు.

10. గాలిబ్ అంటే ఎంత గౌరవమో శ్రద్ధగ చూడండి. ఒకసారి గాలిబ్ సమాధి వద్దకు ఇక్బాల్ వెడలినాడు. ఎవరో గాలిబ్ గజల్‌ను పాడినాడు. ఇక్బాల్ కళ్ళ నీరు కారుచుండ, విలపించుచు గాలిబ్ సమాధిని కౌగలించుకొనెను. ఎంతటి ఆర్ద్రత !

11. దాగ్ — సమకాలీన సమాజములో ఈయన పొందిన గౌరవము, మరి ఏ ఉర్దూ కవియు పొందలేదు. శిష్య బృందాలు, అభిమాన

సంఘాలు, కవి సమ్మేళన సన్మానాలు మరెవరికీ ప్రాప్తము కాలేదు. కాని చివరిదశలో నైజాం ఆహ్వానము మీద హైదరాబాదు వచ్చివేసెను. హైదరాబాదులోనే 1906వ సం.లో మరణించెను. ఆయన సమాధి నేను హైదరాబాదులో చూచాను. ఉర్దూ భాషా సౌందర్యము చూడాలంటే దాగ్‌ను చదవాలి అని ఢిల్లీ స్నేహితులు సలహా యిచ్చిరి. నేను భావాలను వెదకే వాడిని కాబట్టి, దాగ్ భాషను, సాహిత్యాన్ని నేను చదువలేదు.

12. మిణుగురు (జుగ్నూ): ఇక్బాల్ అభిమానులు ఎక్కువగా పొగడే కవిత. ఉత్ప్రేక్షలతో దానిని వర్ణించి, కడకు మూలములో అన్నీ ఒకటే అనే వేదాంత రహస్యాన్ని ప్రకటిస్తారు.

సృష్టి సౌందర్యము అన్ని వస్తువులలో
ప్రకాశించి బహిర్గతమగుచుండును.
మధుర గీతమే శకుంతముల సౌరభము
పరిమళమే ప్రసూనముల కూంజితము
మిణుగురులలో ఉన్నవెలుగే
పువ్వులలో సువాసన
ప్రతి విషయమందును
సృష్టి మహిమ దాగియున్నది.

13. లో కూడ ఇదే భావము:

ప్రపంచ సంగీతశాలలో
ఒకేశ్రుతిలో మ్రోగును అన్నిస్వరములు
పరిమళములు ఉద్యానవనమునకు
అన్ని పువ్వులతో వసంతము !

కడపటిది 'వలపు'తునుకలు పదిగజళ్ళ అఖరిచరణముల ఏరి అనువదించితిని. 51 సంవత్సరములైనది ఇక్‌బాల్ అస్తమించి. ఆయన వర్ధంతికి స్వర్ణోత్సవము నా ఈ కానుక. అంకితము నెహ్రూకు. ఆయన జయంతి శతవర్షముల పండుగలలో ఆయన తొలి కాంగ్రెస్ అధ్యక్షతకు వజ్రోత్సవము (1929) వారి వర్ధంతికి రజతోత్సవము (1964)

ముద్రణలో సాయపడిన శ్రీ యార్లగడ్డ ఆంజనేయులు ప్రభృతులకు కృతజ్ఞతలు.

శాంతి నికేతన్, నెల్లూరు–3
15–8–1989

బెజవాడ గోపాలరెడ్డి

# అంకితము

## శ్రీ జవాహర్‌లాల్ నెహ్రూకు

శతజయంతి సందర్భమున



## I

విశ్వవేదికపై భారతవాణిగ
నినదించిన ప్రజ్ఞావంతుడు.
జాతీయతకు అంతర్జాతీయ దృక్కోణాన్ని
మేళవించిన రాజకీయ చతురుడు
నిత్యదేశ భ్రమణాలలో, అశేష జన నయనాలతో

దైన్యాన్ని వీక్షించి, దాని నిర్మూలనకై
స్వప్నాల కన్న నిర్మాణశిల్పి
అసువుల పొందిన ఆధునికతా మూర్తియై
వైజ్ఞానిక ప్రాసాద ప్రాంగణములోకి
భారతాన్ని ప్రవేశపెట్టిన భవిష్యద్ ద్రష్ట
విశ్వశాంతికై అవిరామ కృషి సల్పిన విశ్వప్రేమికుడు.

పురోగమన పథములో
దేశ నిర్మాణ దృష్టితో
యోజనా సోపానాల నిర్మించిన కార్యశూరుడు
సామ్యవాదమే దేశానికి శ్రీరామరక్ష యని
ఘోషించి, నవచైతన్యాన్ని సృష్టించిన ప్రజానేత
జన సందోహాల సర్వోత్తమ సమావేశకర్తయై
ప్రజాతంత్ర వాదియై
ఉత్సాహాన్ని ననలెత్తించే
వసంతావతార మూర్తియై
వెలసిన చిరస్మరణీయుడు
జవాహర్ సమున్నత లలాటములో
దేశమే సమున్నత శిరస్కయైనది.

నా 'కాలవాహిని' నుండి
6-6-1978
నెల్లూరు.

శ్రీజవాహర్‌లాల్ నెహ్రూ 60 సంవత్సరాల క్రితము తొలిసారిగా కాంగ్రెసు అధ్యక్షులైరి. 29 డిసెంబరు 1929 నాడు జరిగిన లాహోరు కాంగ్రెసు సమావేశములో స్వాతంత్ర్య యోధులకు వారు అర్పించిన జోహార్లు:

For four and forty years this National Congress has laboured for the freedom of India. During this period it has somewhat slowly but surely awakened national consciousness from its long stupor and built up the national movement. If today we are gathered here at a crisis of our destiny, conscious of our strength as well as of our weakness, and looking with hope and apprehension to the future, it is well that we give first thought to those who spent their lives with little hope of reward so that those that follow them may have the joy of achievement. Many of the giants of old are not with us and we of a later day, standing on an eminence of their creation, may often decry their efforts. That is the way of the world. But none of you can forget them or the great work they did in laying the foundations of a free India. And none of us can ever forget that glorious band of men and women who without reckoning the consequences have laid down their young lives or spent their bright youth, in suffering and torment in utter protest against a foreign domination. Many of their names even are not known to us. They laboured and suffered in silence without any expectation of public applause, and by their heart's blood they nursed the tender plant of India's freedom. While many of us temporised, and compromised, they stood up and proclaimed a people's right to freedom and declared to the world that India, even in her degradation. had the spark of life in her, because she refused to submit to tyranny and serfdom. Brick by brick has our national movement been built up, often on the prostrate bodies of her martyred sons has India advanced. The giants of old may not be with us, but the courage of old is with us still, and India can yet produce martyrs like Jatin Das and Wizaya...

మతాచార, మూఢవిశ్వాసాలపై వారికి నమ్మకము లేదని ప్రకటించిరి :

... I have no love for bigotry and dogmatism in religion, and I am glad that they are weakening, Nor do I love communalism in any shape or form. I find it difficult to appreciate why political or economic rights should depend on the membership of a religious group or community......

# తరానయే హింద్

సారే జహాఁసే అచ్ఛా
హిందూస్థాన్ హమారా
హం బుల్‌బులే ఉస్కీ
యే గుల్‌సితాఁ హమారా

గుర్‌బత్ హూఁ అగర్ హం
రహతాహై దిల్ వతన్‌మే
సమఝో వహీఁ హమేఁ భీ
దిల్ హో జహాఁ హమారా

పరబత్ వో సబ్‌సే ఊఁచా
హంసాయా ఆస్మాన్ కా
వో సంతారి హమారా
వో పాస్‌బాఁ హమారా

గోఁద్ మే ఖేల్‌తీ హై
ఉస్కీ హజారోఁ నదియా
గుల్‌షన్ హై జిస్కీ దంసే
రష్కే జహాఁ హమారా

ఆయే ఆచరూదే గంగా
వో దిన్ హైఁయాద్ తుఝుకో
ఉతారా తేరే కినారే
జబ్ కా రాహేఁ హమారా

మజ్‌హబ్ నహీఁ సిఖాతా
ఆపస్ మేఁ బైర్ రఖనా
హిందీ హైఁ హం వతన్ హైఁ
హిందూస్థాన్ హమారా

యూనాన్ వ మిసర్‌వ రోమా
సబ్ మిట్ గయా జహాఁసే
అబ్‌తక్ మగర్ హై బాకీ
నామ్ ఒ నిషా హమారా

కుచ్ బాత్ హై కె హస్తీ
మిట్ తీ నహీ హమారా
సదియోం రహా హై న దుష్మన్
దౌరే జమాన్ హమారా

ఇక్ బాల్, కోయి మహరూం
అపనా నహీం జహాంమే
మాలూం క్యా కిసీ కో
దరదెనిహాం హమారా

# 1
# సారే జహాఁ సే అచ్ఛా

సమస్త ప్రపంచములో మెరుగైనది
మన హిందూస్థానము,
మనము దీని బుల్ బుల్[1] లము
ఇది మన ఉద్యానవనము

పరదేశమున మనము ఉన్నన
ఉండును దేశముమీదనే చిత్తము.
తెలిసికో ! మనచిత్తమున్న తావున
మనముకూడ నివాసము

పర్వతములు అన్నిటికన్న ఉన్నతములు
గగనమునకు ఇరుగుపొరుగులు
అవే మన దుర్గరక్షకులు.
అవే మన కాపలావారు

1. కోకిల వంటి పక్షి.

దీని అంకములో వేల నదులు
ఆటలాడుచున్నవి.
వీని స్పర్శలే మనకు పైరుపంటలు
స్వర్గమునకు ఈర్ష్యాకారకములు

గంగా ప్రవాహమా !
ఆ దినములు నీకు ఉన్నవా జ్ఞాపకము
బారులు బారులుగ బాటసారులు
నీ ఒడ్డుల విడిది దిగిరి.

మనలో మనము పోరుటకు
మతములు నేర్పలేదు.
భారతీయులము మనము
దేశము మనది హిందూస్థానము

యూనాన్, ఈజిప్టు, రోములు
పుడమిలో తుడుచుకొని పోయినవి.
కాని ఇంకను సజీవములుగ నున్నవి
మన పేరుప్రతిష్ఠలు.

కొన్ని గుణము లున్నవి
అందుననే మన వ్యక్తిత్వము తగ్గలేదు.
శతాబ్దములుగ శత్రువులుగ నున్నవి
మనకు కాలభ్రమణములు

ఇక్బాల్ ! ఇలలో లేరు.
మనరహస్యముల నెరిగినవారు.
దాచబడిన వేదనలు మనవి
ఎవరికేమి ఎరుక ?

23—9—64
ఢిల్లీ.

# 2
# నా దేశము అదే

చిష్తి ఏ భూమిమీద
భగవంతుని సందేశము వినిపించెనో
నానక్ ఏ నందనములో
ఏకేశ్వరుని గీతము పాడెనో
తార్తారులు దేనిని
తమ దేశముగా చేసికొనిరో
అరబ్బులచేత ఏది
అరేబియా ఎడారుల వదలించెనో
నా దేశము అదే ! నా దేశము అదే !

యూనానులకు ఏది
విస్మయము కలిగించెనో
సమస్త పృథ్వికి ఏది
విద్యలు కళలు ఒసగెనో
భగవంతుడు దేని మట్టికి
స్వర్ణ ప్రభావము కలిగించెనో
తురుష్కులకు ఏది
చేలాంచలమును వజ్రములతో నింపెనో
నా దేశము అదే, నా దేశము అదే !

నక్షత్రములు రాలినవో
ఈరాన్ గగనతలము నుండి
తిరిగి కాంతిని ప్రసరించి మెరిపించెనో ఏవి
జ్యోతిర్మండల ఉన్నతముల నుండి
ఏకేశ్వరుని స్వరమును
ధరణి వినెనో ఏ ప్రదేశమునుండి
అరబ్బుల సర్దార్ ప్రవక్తకు
శీతల వాయువులు వీచెనో ఏతావునుండి
నా దేశము అదే, నా దేశము అదే,

దాసుడైన కలీం
ప్రపంచమునకు వినిపించెనో ఏ పర్వతములనుండి
ప్రవక్తకై శ్రద్ధాసక్తి అను పడవ
ఎచ్చట వచ్చి లంగరు వేసెనో
గగన మండలమునకు
సోపానములు ఏ ధరణిలో ఉన్నతములో
ఏ మహీతల వాతావరణములో వసించుట
స్వర్గలోక జీవితమగునో
నా దేశము అదే, నా దేశము అదే.

26-4-86
నెల్లూరు.

## 3
# క్రొత్త శివాలయము

నిజము చెప్పెదను బ్రాహ్మణుడా !
నీవు తప్పు అనుకొనకపోతే
నీ దేవాలయములోని మూర్తులు
పురాతనములై పోయెను.

సొంతవారితో వైరము పెట్టుకొనుట
నీవు ఆ మూర్తులనుండే నేర్చితివి.
కలహములు పోరాటములు
మౌల్వీకిని నేర్పించెను ఖుదా

తుదకు నేను విసిగిపోయి
మందిరమును మస్జీదును వదలితి.
మౌల్వీ ఉపదేశముల వదలితి
నీ పురాణగాథలనూ వదలితి

నీవు శిలామూర్తులలో
దేవుడున్నాడని తలచితిని.
దేశధూళి అణువు అణువునందును
నాకు దేవుడు కాన్పించును.

పరాయితనపు పర్దా
రా! తిరిగి ఒకతూరి ఎత్తివేసెదము.
చెదరిపోయినవారిని తిరిగి కలిపెదము.
ద్వంద్వపు బింబమును తుడిచివేసెదము

డెందము అను పల్లె బహుకాలముగ
శూన్యమై పడియున్నది.
ఒక క్రొత్త శివాలయమును
రా! ఈ దేశమున కట్టెదము.

ప్రపంచములోని తీర్థములలో
ఉన్నతము కావలె మన తీర్థము
ఆకసపు కొంగులతో
దీని కలశముల కలిపెదము

ప్రతి ఉదయము లేచికూర్చుని
ఆ మంత్రముల జపించెదము.
పూజారు లందరిచే
ప్రేమసుధను పానము చేయించెదము.

శక్తియు శాంతియు
భక్తుల గీతములలో కలవు
ధరిత్రీ నివాసుల ముక్తి
ప్రేమలోనే కలదు.

22-9-64
ఢిల్లీ.

# 4
# జావీద్ పేర

( లండన్‌లో నుండగా కొడుకు జావీద్ తన సొంత
అక్షరములతో వ్రాసిన మొదటి ఉత్తరమును చూచి )

ప్రేమ ప్రపంచములో
నీ స్థానమును సృష్టించుకో
క్రొత్తయుగమును, క్రొత్త
ఉదయాస్తమానాలను సృష్టించుకో !

ఈశ్వరుడు నీకు ప్రకృతి
హృదయమును ఎరుకచేస్తే
పుష్పముల మౌనముతో
సంభాషణాశక్తి సృష్టించుకో.

పాశ్చాత్యుల విలువైన
సీసాలు కృతజ్ఞతతో ఎత్తకు
భారత వర్షపు మట్టితోనే,
నీ కూజా పాత్రలు సృష్టించుకో.

నేను లతల ఆసక్తితో
చూచుచున్నాను
నా కవితలే
నా ఫలములు.

నా విధానము ఐశ్వర్య
వంతులది కాదు
సాధు సన్న్యాసులదే !
అత్మను అమ్ముకోవద్దు
పేదరికములోనే పేరును సృష్టించుకో.

## 5
# శ్రీ రాముడు

హిందూస్థాన్ చషకము
సత్య మధువుతో పొరలుచున్నది,
పశ్చిమ గోళమున—

హిందుస్థానీ రాముడు
అంతా వేదాంత మే.

హిందూస్థానీయుల భావములు
గగనము వరకు ప్రభావితములు.

ఔన్నత్యములో ఆకసమున కన్న
ఎత్తైనది హిందూస్థాన ఆవరణము.

ఈ దేశములో సమ్మిశ్రితములు
సహస్ర ప్రాంత సంస్కృతులు.

వీని ఉనికితో ప్రసిద్ధము
ప్రపంచములో హిందూస్థాన నామము.

రాముని చరిత్ర
హిందూస్థానమునకు వైభవ కారణము.

జ్ఞానులు భావిస్తారు
వీనిని హిందూస్థాన అవతార పురుషుడుగ.

అతని ఉపదేశ దీప
దీప్తి మహిమ ఇదే !

యుగములో కాంతిని చిత్రించే ప్రభాతాలు
సంధ్యలు హిందూస్థానమువే

కరవాలములో భాగ్యవంతుడు
శౌర్యములో మహావీరుడు !

పవిత్రతలో, ప్రేమానురాగములలో
మహానుభావుడు !

28-4-86
నెల్లూరు.

(2)

# 6
# గురు నానక్

జాతి గౌతముని సందేశమును
కొంత ఉపేక్షించినది.
తన అమూల్య మౌక్తిక బీజపు
ఔన్నత్యమును గుర్తింపలేదు.

అయ్యో ! దురదృష్టమున
దైవవాణి ఎరుకలేక యుండినది.
వృక్షము తన ఫల మాధుర్యాన్ని
అవలక్ష్యము చేసినది.

జీవన రహస్యములను
ఇతడు విదితము చేసెను-
హిందూస్థానమునకు,
కాని శుష్క- వేదాంతముపై
అభిమానమును పెంచుకొనెను.

ఏది దేవుని దీపముతో ప్రకాశించునో
అది ఈ మండపము కాదు.
కరుణా వర్షాలు కురిసినవి
కాని భూమి అనుకూలముగ లేదు.

అయ్యో ! వ్యవసాయమునకై
హిందూస్థానము శోక క్షేత్ర మాయెను.
మానవ వేదనలు ఈ హృదయ సీమకు
అపరిచితములుగ నుండెను.

మధుపానముతో ఇంతదనుక
పురోహితుడు తలకైపుతో ఉండెను.
గౌతముని దీపము
పర సభలలో వెలుగుచున్నది.

విగ్రహశాలలు మరల చాలకాలమునకు
వెలుగులతో ప్రకాశించెను
ప్రవక్త జ్యోతితో
యోగి కుటీరాలు ప్రకాశించెను.

కడకు, తిరుగ ఏకేశ్వరుని వాణి
పంజాబు నుండి ధ్వనితమాయెను.
స్వప్నములనుండి హిందూస్థానమును
ఒక పూర్ణపురుషుడు మేల్కొలిపెను !

24-5-86
నెల్లూరు.

# 7
# స్వామి రామతీర్థ

కదలిలో జలబిందువులతో
భుజాలు రాసుకొంటూ,
కాంతి హీనుడవుగ ఉండినావు

తొలుత ముత్యమైనావు
పిదప అరుదైన ముత్యమైనావు
ఆహా! వర్ణములు, సౌరభాల రహస్యములు
ఎంతటి నేర్పుతో విడదీసితివి ?

నేను ఇప్పటికిని
రంగుల, వాసనల విచక్షణలలో ఖైదీని
జీవితపు కొలిమి సెగల తట్టుకొని
దహించే అనల మైతివి!

దాని స్ఫులింగాలను ఆర్పి
పరిశుద్ధ హోమాగ్నివైతివి.
హృదయ వికాసమునకు
జీవిత విషమ సమస్యలు
అద్భుతముగ పని చేయును !

భగవంతుని ముత్యముల
తెచ్చి దాచితివి సింధువులో
చూడలేని నయనములకు
మరుగైనవి పరిణామాల ఫలితాలు.

అలజడులు అణగిన క్షణమున
పాదరసమే వెండి పేనాకు ఉపయుక్తమైనది.
జీవిత విగ్రహాన్ని ఛేదించుచున్నాడు -
ప్రేమతో మూర్తినాశకుడు.

జీవన అనురాగ భ్రాంతులు
జ్ఞానాగ్నికి ఇంధనముల వలె
మసి అగుచున్నవి.

28-7-86
నెల్లూరు.

# 8
# సూర్యుడు

(గాయత్రి అనుకరణ)

సూర్యుడా ! ప్రపంచ ద్వారముల
తెరచు మూర్తివి నీవు;
మహీతలపు కచ్చేరీలలో వేసే రాజముద్ర నీవు;
ఉన్నవాని లేనివాని ఆవిష్కరణముల కారణమవు !

ధరణీ నందన వనము
నీ ఉచ్ఛ్వాసములచేతనే పచ్చబడును
పంచభూతముల దృశ్యము
నీ వలననే స్థిరపడినది.

ప్రతి వస్తువులోని ప్రాణస్పందన
నీ కిరణములచేతనే
నీ శోభామయ దీప్తిచేతనే
ప్రతి పదార్థమునకు పోషణ !

నీ వెలుగే ఆపాదమస్తకము జీవితము
కాలమునకు కాంతివైన భాస్కరుడవు
హృదయమవు, మేధస్సువు, ఆత్మవు, చైతన్యమవు
సూర్యుడా ! మాకు పురుషార్థముల స్ఫూర్తి నిమ్మ.

జ్ఞాన నేత్రమునకు నీ మహిమచే
కాంతి నిమ్మ.
అస్తిత్వపు విపణిలో
సామానుల తూనిక చేయువాడవు.

నీచ ఉన్నత జీవులకు
పోషణ కర్తవు నీవు.
నీ ఉనికి ప్రతాపము
ప్రతి ప్రాణియందు కాన్పించును.

నీ ఉదయ సంధ్యలలో
పర్వత శ్రేణులు మనోహరమైనవి.
సకల జీవ ప్రాణములకు
సంవర్ధకుడవు నీవు.

శాశ్వత కాంతికి కిరీట ధారివి నీవు,
లేదు ఏ ప్రారంభము
లేదు ఏ సమాప్తము !



ఆది అంతాల కారాగార
స్వతంత్రమగు తేజము నీది !

10-7-86
నెల్లూరు.

# 9
# సాక్షి

మందిరమును త్రావించి పడగొట్టుట
అందరికి విదితమైన విద్యయే !

పడిపొయ్యే వాడిని నీవు
పట్టుకొన్నప్పుడే వినోదము !

ఎచ్చటనుండైనా అమృత రసాన్ని తెచ్చి
వారిని కాపాడెదవు.

మదిరా పానము చేసే పాతవారు
లేస్తారు వెడలిపోతారు.

నీ వినోదాలతో సల్లాపాలతో
రాత్రి గడచిపోయినది.

ప్రాతఃకాలము సమీపించుచున్నది
అల్లా పేరును స్మరించుకో -
సాకీ !

3-4-84
నెల్లూరు.

10

# మీర్జా గాలిబ్

---

మానవుల భావముల మీద
నీ వ్యక్తిత్వపు వెలుగులు ప్రసరించెను.
కల్పనా విహంగపు పక్షములు
ఎంతో దూరము చేరగలవు.

నఖశిఖ పర్యంతము నీవు ఆత్మవు
సాహిత్యసభలు నీ శరీరము.
గోష్ఠుల శోభగా ఉంటివి
గోష్ఠుల వెనుకను దాగి యుంటివి.

ఏ దీప్తియై ఏది
వస్తువునందును దాగి యున్నదో
ఆ సౌందర్యమును నే కాంచుటకు
నీ చక్షువులకు సమ్మత మాయెను.

జీవిత గోష్ఠియైన ఈ ధరణి
నీ వాద్యములచే భాగ్యశాలి ఆయెను.
శైల మాలల శాంతి
నదుల కలగానముల వలె.

నీ కల్పనా వైకుంఠముచే
ప్రకృతికి వసంతము
నీ భావనా కేదారములలో
మొలచినవే ఈ ఇలను
సస్యశ్యామల మొనర్చెను.

జీవితమంతయు దాచబడెను,
నీ రచనా చమత్కారములలో !
సంభాషణార్థము కదలుచున్నవి-
నీ చిత్తరువుల అధరములు.

నీ అద్భుత శక్తి సంపన్నమై
అధరములపై శతాభిమానముల
పొందుచున్నది వాక్ శక్తి.

నీ ఉన్నత విహారముల తిలకించి
శుక్రతార విస్మయములో నిమగ్నము !
నీ శైలీ విలాసముల కామించి
శీర్షి కాప్రేయసి బలి కాగోరుచున్నది.

ఢిల్లీ కళిక నవ్వుచున్నవి
సిరాజ్[1] పుష్పముల ఈసడించి
అయ్యో ! ఈ దురదృష్టపు ఢిల్లీలో
శాశ్వత నిద్రలో ఉన్నావు.

'వేమరు'[2] వనములో నిద్రించుచున్నాడు
నీ సహగాయకుడు 'గేటే'[3]
సరస సంభాషణలో
నీ సరిసమానులు లేరు.

పూర్ణభావ సంపద
ఉన్నత కల్పనలతో సరితూగినది.
అయ్యో ! హిందూస్థాన్ ప్రాంతమునకు
ఎట్టికేసు వాటిల్లెను !

---

పారశీకదేశమునందలి ఒకపట్టణము.

2. గేటేకవి సమాధి నొందిన గ్రామము-జర్మనీ దేశములోనిది

3. సుప్రసిద్ధ జర్మన్ కవి.

అదృశ్య వైభవము, సూక్ష్మ
విషయగ్రాహియైనదృష్టి ఏమాయెను ?
ఉర్దూ కుంతలములకు ఇంకను
నీ దువ్వెన అవశ్యకమై యున్నది.
శలభానికి హృదయ తాపమును
కల్గించు ఉన్మాదమై యున్నది ప్రదీపము.

అయ్యో ! ఢిల్లీ ! కళలకు శిల్పములకు
ఉయ్యాల వంటిదానా !
నీ దేహమంతయు రోదనము
ఇంటా వాకిటా నిశ్శబ్దము !

నీ అణువు అణువులో సూర్య
చంద్ర సములు నిద్రించుచున్నారు.
నీ ధూళిలో దాచబడినవి
లక్షల ముత్యములు !

ఇట్టి వారిలో యుగ గర్వ కారకుల
ఎవరైనా, గోరీ కట్టబడిరా ?
కాంతితో మెరిసే ముత్యములు
ఇట్టివి ఏమైనా పాతిపెట్టబడినవా ?

16-9-64.
ఢిల్లీ.

## 11
# దాగ్[1]

గాలిబ్ గొప్పతనము కొంతకాలము
మరుగుపడెను భూమిలో;
మహది మజరూహ్[2] నివాసి
యాయెను నిశ్శబ్ద నగరమున.

కూలనేసెను పరాయి ప్రాంతమున
అమీర్ మీనాయిని[3] మృత్యువు.
సభా నేత్రమున ఇంతదనుక కలదు
అమీరుని మధిరా మత్తత.

1. దాగ్ - ఢిల్లీలోని లాల్‌ఖిలాలో పుట్టి పెరిగి, హైదరాబాదులో మరణించిన మహాకవి.
2. మహది మజరూహ్ - ప్రాచీన కవులు.
3. అమీర్ మీనాయి - సుప్రసిద్ధ కవి.

కాని, నేడు తోడి గాయకా !
తోట అంతయు దిగులు చెంది యున్నది.
కాంతి దీపము ఆరిపోయెను
సాహితీ సభ శోకము చెందియున్నది.

ఢిల్లీ బుల్‌బుల్ ఆ
నంద వనమున కట్టుకొనెను గూటిని
జీవన వనమున కోకిల
అన్నియు కూడి కూయుచున్నవి,

చనిపోయెను, దాగ్, అయ్యో !
పాడె అతనిది భుజశోభ యాయెను
ఢిల్లీ కడపటి కవి నిశ్శబ్దు డాయెను

ఇక నెక్కడ ఆ చమత్కారముః
వర్ణనా వైఖరుల సొబగుల
వృద్ధాప్యపు కర్పూరము
దాగియుండెను యౌవనాగ్నులు .

ఆయన ముఖమున వెల్వడిన కోరికలే
అందరి హృదయముల దాగి ఉండినవి.
ఆయన కడ అర్థమను లైలా
మేలిముసుగును వదలినది

అంతదనుక మేనాలో కూర్చుని ఉండినది.
ఇక ఎవరు అడుగగలరు ?
పవనముల ప్రసూన మౌన రహస్యముల
ఎవరు ఎరుగగలరు ?
వనముల కోకిల రోదనా రహస్యముల ?

భావముతో ఎగురుటలో
వాస్తవికత పట్ల ప్రమత్తుడు కాలేదు.
పక్షి ఎగురుచుండియు
గూటిమీదనె దృష్టిని నిలిపియుండెను.

సూక్ష్మదర్శియగు భావములతో
ఆకసమున కొలతలు వేయుచు
భిన్నశీర్షికల సొంపులు
మన కిక ఎవరు చూపగలరు ?

యుగ తిక్త రుచుల రూపును
ఎవరిక చిత్రించి ఏడ్పించగలరు ?
కల్పనా నవ్య జగత్తును
ఎవరిక చూపించి ముగ్ధుల చేయగలరు ?

ఈ తోటలో షీరాజ్[1] కోకిల హాఫిజ్[2] వంటి
మధుర భావుకులు పుట్టగలరు,
శతమానములుగ కవులు
అద్భుతముల చూపగల దివ్యశక్తి గలవారు.

కళా మందిరములలో
వేల శిల్పులు ఉద్భవించగలరు.
మధువును త్రాగించెదరు
క్రొత్తసాఖీలు, క్రొత్తపాన పాత్రలతో !

హృదయ గ్రంథాలకు
చాల వ్యాఖ్యానములు వ్రాసెదరు.

---

1. పారశీక దేశమునందలి ఒకపట్టణము.
2. ప్రసిద్ధ పారశీక కవి (వేదాంతవేత్త)

యౌవన స్వప్నములారా !
మీ అర్థములు చాలమంది చెప్పగలరు.
కాని ప్రేమచిత్రమును
యథాతథముగ ఎవరు వ్రాయగలరు ?

గురితప్పక బాణములు వేయు
యోధుడు కూలిపోయెను.
ఇక హృదయములపై
అంబులు ఎవరు విసరగలరు ?

కవితా క్షేత్రములలో
అశ్రు బీజముల నాటుచున్నాను.
ఢిల్లీ ప్రాంతమా ! నీవును ఏడ్వుము
'దాగ్' కొరకై నేను ఏడ్చుచున్నాను.

ఢిల్లీ సాహిత్య గోష్ఠుల
కేంద్ర స్థానమా !
మరల నేడు నీ వనము
శిశిరముచే ధ్వంసమాయెను.

వెడలిపోయెను సుగంధముల రీతియే
నీ ఆ బహువర్ణ ప్రసూనము
అయ్యో ! ఉర్దూ భవనము
'దాగ్' లేక ఖాళీ ఆయెను.

లేకపోయెను కాబోలు
నీ ప్రాంతపు మట్టిలో అట్టి ఆకర్షణ.
ఆ పూర్ణచంద్రుడు మరుగుపడెను
దూరదక్కన్ ధూళిలో !

ఉండిన సాఖీలు లేచిపోయిరి
మధుశాల శూన్యమాయెను.
ఢిల్లీ సభల జ్ఞాపకార్థము
ఒక్క 'హాలి' కవి మిగిలి ఉన్నాడు.

అన్యాయపు మృత్యువు
అభిలాషలచే రక్తాశ్రువుల కార్పించినది.
మృత్యు వను వేటకాడు
అంధకారముల బాణముల విసరుచున్నాడు
కాని దోషారోపణకై నోరాడకున్నది.

తోట ఉనికికి కారణమగుచున్నవి.
శిశిరంపు చేష్టలు కూడ;

విశ్వవ్యాప్తమగు
శాసనాలె సర్వమును ప్రభావితము చేయును.

వనమునుండి పుష్ప
పరిమళముల నిర్గమనము
ప్రపంచమునుండి
తోటమాలి ప్రయాణము !

14-7-64.
ఢిల్లీ.

# 12
# మిణుగురు పురుగులు

తోట ఇంటిలో కలదు మిణుగురు వెలుగు;
పుష్పముల కవి సభలో దీపము వెలుగుచున్నదా ?

వచ్చెనా ఆకసమునుండి ఎగురుచు ఏదైన నక్షత్రము ?
లేక ప్రాణము వచ్చెనా చంద్రుని కిరణాంశమునకు ?

లేక రజనీ రాజ్యమునకు దివసంపు దూత అరుదెంచెనా ?
పరదేశమున ప్రకాశించెను, స్వస్థానమున కీర్తినొందక !

లేక, ఉడుపతి ఉడుపులనుండి పేలిక ఉండ జారిపడెనా
లేక, సూర్యుని దుస్తులనుండి ఒకఅణువు ప్రకాశించుచున్నదా !

దాగియుండిన ప్రాచీన సౌందర్యపు కాంతి బిందువా !
ప్రకృతి దానిని, ఏకాంతమునుండి సభలోనికి ఈడ్చెను

చిన్న చంద్రునిలో శుక్ల కృష్ణపక్షముల కలయిక
ఇపుడు గ్రహణములో విడుపు, ఇపుడు గ్రహణములో పట్టు !

శలభమునకు రెక్కలున్నవి, మిణుగురునకు రెక్కలు కలవు
అది వెలుగును వెదకుచుండును, ఇది ఒడలంతా వెలుగు !

## 2

కృతి పుడమిలో అన్నింటికి
హృదయమును ఆకర్షించు శక్తి నిచ్చెను.

శలభమునకు వెలుగు దప్పిక నిచ్చెను.
మిణుగురునకు వెలుగు నిచ్చెను.

భాషలేని పక్షులకు స్వనముల నొసగెను; పువ్వులకు
రెక్కనాలుకల నొసగి నిశ్శబ్ద పాఠముల నేర్పెను.

సంధ్యా రాగముల దృశ్యముల రమ్యత పతనము కొరకే
ఆ అప్సరసకు దీప్తినిచ్చి, అల్పాయువు నొసగెను !

ప్రాతఃకాలమునకు వర్ణశోభల నిచ్చెను,
పెండ్లి కూతురు రమణీయ రూపము వలె

ఎర్రని దుస్తుల తొడగి, మంచు అద్దమును ఇచ్చెనా !
చెట్లకు నీడలను, తెమ్మెరలకు వీచు శక్తి నొసగెనా ?

నీరములకు పారుదల, తరంగములకు చంచలత ప్రసాదించెను.
ఈ వ్యత్యాసము లున్నవి. ఈ మాట నిజము
మిణుగురునకు ఏది దినమో, అదే మనకు రాత్రి !

## 3

సృష్టి సౌందర్యము అన్ని వస్తువులలో
ప్రకాశించి బహిర్గత మగుచుండును.

మాటలలో అది భాష, మొగ్గలలో వికసింప కోరిక
చంద్రుడు ఆకసమున కవి గుండెవలె నున్నాడు.

అచ్చట వెన్నెల కలదు, ఇచ్చట విరహవేదన
సంభాషణా వైఖరి వంచించుచున్నది, లేకున్న
మధుర గీతమే శకుంతముల సౌరభము !
పరిమళమే ప్రసూనముల కూజితము !

ఏకత్వపు రహస్యములు, విస్తారముగ
మారువేషముల దాల్చినవి !

మిణుగురులలో ఉన్న వెలుగే
పువ్వులలో సువాసన
మరల ఎందులకు ఈ భిన్నత్వములు—ఆందోళనా హేతువులు ?
ప్రతి విషయమునందును
సృష్టిమహిమ దాగియున్నపుడు !

14-9-64
ఢిల్లీ.

# 13
# పక్షి – మిణుగురు పురుగు

మునిమావు వేళ ఒక పాడే పిట్ట
కొమ్మపై కూర్చుని పాడుచుండెను;
నేలపై మెరిసే వస్తువొకటి కాంచెను.
పక్షి క్రిందికి దిగివచ్చెను, అది మిణుగు రని గుర్తించెను.

మిణుగు రనెను “ఓ పాటలు పాడే విహంగమా !
దీనురాలినైన నాపై, నీ చుంచువు వాడిని చూపకు.
నీకు పాటను, పువ్వులకు సువాసన ఎవ్వ డిచ్చెనో
ఆ ఈశ్వరుడే నాకు వెలుగు నిచ్చెను.

“కాంతి వస్త్రములచే కప్పబడినదానను.
పురుగుల పుడమిలో వెలుగు కొంతను నేను,
నీ కలగానము స్వర్గ కర్ణములకు ప్రియమైతే
నా కాంతి వైకుంఠ నేత్రములకు పర్వ మగును !

"నా రెక్కలకు ప్రకృతి వెలుగు నిచ్చెను.
నీకు హృదయముల మోహింపజేయు నాదము నొసగెను.
నీ నోటికి పాటలు నేర్పెను.
నన్ను తోట కాగడాగా నొసర్చెను !

"కాంతి ప్రసాదించెను నాకు
సంగీత జంత్రము నీకు
కాంతి తప్ప సంగీత జంత్రము
ప్రతిఘటించలేదు.

"పృథ్విలో అవి రెండును
సమ ఆసనమున కూర్చున్నవే !
జీవన భవనముల నివాసము అన్నిటితో
నిమ్నోన్నతముల ప్రదర్శన అన్నిటితో !

"ప్రపంచ సంగీత శాలలో
ఒకే శ్రుతిలో మ్రోగును అన్ని స్వరములు
పరిమళములు ఉద్యానవనమునకు
అన్ని పువ్వులతో వసంతము.

10-7-76

## 14
## రాత్రి - కవి

---

రాత్రి :

ఎందులకు నా వెన్నెలలో
తిరుగుచున్నావు వ్యాకులుడవై
పుష్పాకారమున మౌనము దాల్చి
సుగంధము వలె వ్యాపకుడవై ?

తారామౌక్తికముల, బహుశా పరీక్షించు వ్యాపారివి నీవు
ఏదో నా కాంతి వాహినిలో మీనము నీవు.
లేక నా ముఖఫలకమునుండి రాలిన తారవా ?
ఉన్నత విహారము వదలి పడి క్రింద వసించుచున్నావా ?

జీవన వాద్యపు తంత్రులు నిశ్శబ్దము లాయెనా ?
జీవిత స్వప్న చిత్తరువుల చూపు నా దర్పణమువా ?
సింధు అగాథమున సుడి గుండపు కన్ను నిద్రించుచున్నదా ?
తీరమును కొట్టుకొని చంచల తరంగము నిద్రించుచున్నదా ?

నేలపై నున్న పల్లెసీమలు ఎట్టి అలజడులు కల్పించుచున్నవి ?
జనులే కాపురము చేయునటుల కనులు మూయుచున్నవి.
కవి హృదయమే, కాని శాంతి ఎరుకలేదు.
ఎటుల మేల్కొని ఉన్నావు నా మంత్ర ప్రభావమును ధిక్కరించి !

కవి :

నేను వీ వెన్నెల మాగాణములలో
ముత్యముల నాటించుచున్నాను.
మానవులతో విసిగి, నిశాంత తార వలె
మౌనముగ ఏడ్చుచున్నాను.

దిన ఆందోళనలతో తీరిక లేక, సిగ్గిలుచు
రాత్రి ఏ కాంతమున నా అశ్రువులు రాలుచున్నవి.
నాలో అణచబడిన ఆవేదనను ఎవరికి వినిపించెదను ?
నాకోర్కెల తీక్ష్ణ దృశ్యములు ఎవరికి చూపించెదను ?

నా నిర్భయమగు పిడుగు నా గుండెపై బడి ఏడ్చుచున్నది
చూచు కన్నులు ఎటుల నిదురించగలవు ?
సమాధి దీపముల వలె, నా మిత్ర
మండలియు పరిసమాప్తి నొందెను.

అయ్యో ! రాత్రీ ! నా గమన ధ్యేయము
ఇంకా చాల దూరముగ నున్నది

వర్తమాన యుగ వాతావరణము దానికి ప్రియము కాదు.
తనకు సంభవించు నష్టము తనకు ఎఱుక లేదు.

ప్రేమ సందేశమును ప్రకటించ నేను తత్తర పడుచున్నాను.
నీ మెరిసే చుక్కలకు వినిపించుచున్నాను.

# 15
# నీరవత

నిశ్శబ్దముగ నుండెను చంద్రుని వెన్నెల
శాఖలతో నిశ్శబ్దముగ నుండెను ప్రతి వృక్షమును !

లోయలో పాటలు పాడే పిట్టలు నిశ్శబ్ద
శైలమాలలు పచ్చ దీపములు దాల్చి నిశ్శబ్దము

ప్రకృతి మైమరచి నట్లుండెను.
రాత్రి ఒడిలో నిద్రించుచుండిన ట్లుండెను.

ఏదో శాంతి మంత్రశక్తివలె నుండెను.
నేకర్ *నదీ గమనమును శాంతిని వహించెను.

తారల నిశ్శబ్దపు జట్టులు బయల్వెడలినవి
ఈ దంతులు గంటలు లేకనే పయనించుచున్నవి.

నిశ్శబ్దములు కొండలు, ఎడారులు, సముద్రములు
ప్రకృతి ధ్యాన నిమగ్న మాయెనా అను నట్లుండెను.

హృదయమా ! నీవును శాంతింపుము.
అంకమునందు దుఃఖమును గైకొని నిద్రింపుము.

---

్మనీలో ఒక నది పేరు.

# 16
# కొండల మబ్బు

ఎత్తైన ఆకసమును ముద్దిడు గూడు నాది,
శైల తరంగముల మేఘమును నేను
చేలాంచలము నాది పుష్పభరితము !

ఎడారులు కొన్ని వేళలా
ఉద్యాన వనములు కొన్ని వేళలా
విడిది నాది !

నగరములు మరు భూములు నావే
అరణ్యములు సముద్రములు నావే
ఎప్పటో లోయలో నిద్రించడం నాకు ఇష్టమే.
కొండల పచ్చదనము ముఖ్‌బల్
పడకయై నాకు ప్రియమే.

ముత్యములు రాల్చెడం ప్రకృతి నాకు నేర్పెను.
సాక్షాత్కరించిన దైవ కృప యగు
మబ్బుల ఒంపెలను తోలే గాయకుడను !

హతాశుడై క్రుంగిన కర్షకుని డెందముల
నవాంకుర సస్య క్షేత్రములుగ నొనర్చి
సిరి సంపదల శోభా భవనముగ మార్చెదను.

జీవన కపోలములపై అలకలనే పర్వెదను
గాలి అలల దువ్వెననై సరిదిద్దుదును.

దూరమునుండే ఆశా నేత్రముల తృప్తి పరచెదను
ఏదో పల్లెపై మౌనముగ తేలి పోయెదను.

విహరిస్తూ నదీ ముఖమునకు చేరగా
ప్రవాహములో సుడి గుండముల సృష్టించి
నదీ కర్ణములకు పోగులు పెట్టెదను.

క్రొత్తగ మొలిచే పంట చేల కోరికల తీర్చెదను
సముద్ర సంజాతను నేను
సూర్యపాలితను నేను !

కొండ సెలయేటికి కడలి ఘోష కల్పించెదను
పక్షుల గాన తత్పరములుగ కావించెదను
పచ్చని బయళ్ళ తలలపై నిలిచి
మొక్కల 'లే' యని ఆనతిచ్చెదను !

పుష్ప ముకుళములకు హాస వినోదాలు కల్పించెదను.
నా కనికరముచే చీకటి రాత్రుల కాన్పించును.
కొండ కొంగు లోయలోని కర్షకుల కుటీరములు.

10-7-76

# 17
# ఒక కోరిక

ప్రపంచ గోష్ఠులతో
విసిగి పోయితి దైవమా!
సభలలో ఏమి ఆనందము
హృదయమే ఆరిపోగా?

అలజడుల నుండి పారిపోయి
నా డెందము వెదుకుచున్నది
సంభాషణను, వెర్రియగు శాంతిని!

నిశ్శబ్దమునకై పడి చచ్చుచున్నాను
-దే నా కోరిక!

కొండ కొంగువలె నున్న లోయలో
చిన్న గుడిసె కావలె.

భావముల చెరనుండి ముక్తుడనై
ఏకాంతమున దినములు గడపవలె.

లోక విచార భరితమగు నా గుండె నుండి
ముళ్ళు అన్నీ వదలవలె.

పక్షుల కల స్వనములలో
సంగీత సుఖము పొందవలె.

నీటి చెలమల చప్పుడులలో
తంబురా మీటుచున్న ట్లుండవలె.

పూ మొగ్గలు అరవిచ్చి
ఎవరివో వార్తలు చెప్పున ట్లుండవలె.

చిన్ని మధుపాత్రల వలె
ప్రకృతి శోభను త్రావించవలె.

చేతులే తలదిండ్లు కావలె
పచ్చని పచ్చికలే పడకలు కావలె.

వెలుగులు సిగ్గిలు నట్టి
సొగసులు ఏకాంతమున అమరవలె.

నా స్వభావముచే పక్షులు
ుతో చనవుగ మచ్చిక కావలె.

నన్ను చూచి, వాని చిరుత డెందములలో
ఎట్టి జంకులు రాకుండవలె.

ఇరు కెలంకుల బారులు తీరిచి
చెట్లు పచ్చగ నుండవలె.

నదిలోని తేటగు నీళ్ళ
చిత్తరువులు తీయుచుండవలె.

శైల మాలల దృశ్యములు
ఎంతో మనోహరముగ నుండవలె.

నీరములు కూడ తరంగములై
ఎగిరి ఎగిరి తిలకించవలె.

ఆ ప్రదేశపు అంకము నందు
పచ్చదనము హాయిగ నిద్రించవలె.

జొంపముల చుట్టు తిరుగుచు
నీరు మెరయుచు పారవలె.

పువులు లేత కొమ్మలు
వంగి వంగి నీరముల నిమురవలె.

ఏదో అందగత్తె అద్దములో
తన వేష భూషల చూచున ట్లుండవలె.

సంజ యను పెండ్లి కుమార్తెకు
సూర్యుడు గోరంట పెట్టినట్లుండవలె.

పసిమి ఎఱ్ఱని ముస్తాబుల
పువ్వు కన్నెలు తాల్చి నట్లుండవలె.

రాత్రి ప్రయాణము చేయువారు
అలసి నిలిచిపోయిన తరి

వారి ఆశ లన్నియు
పగిలిన ప్రమిద వలె నున్న తరి

వారికి మెరపు మెరసి
నా కుటీరమును చూపవలె.

ఆకసపు నాలుగు చెరగుల
మబ్బులు గుమి గూడిన తరి

వేకువ వైతాళికుల వలె
తుది జాముల కోకిలలు కూయు తరి

నేను వాని తోడి గాయకుడను
అవి నా సహ గాయకులు కావలె.

ధర్మము దైవము పిలుపులు
నా కర్ణముల చొరని తరి

నా గుడిసె కప్పు చిల్లులు
ప్రొద్దు పొడుపును తెలుపవలె.

తుషారములో పూజా క్షాళనము
ప్రసూనములు చేయు తరి

నా రోదనాశ్రువులే
స్నాన జలములు కావలె
నా విలాసము ప్రార్థనలు కావలె.

ఈ నిశ్శబ్దములో నా ఆక్రందనములు
ఎంతో ఉన్నతములై పోవలె.

తారల ప్రయాణపు జట్టులకు
నా గొంతే గంట కావలె.

సానుభూతి పదుల గుండె
నా ఏడ్పులే ఏడ్పించు.

మైమరచి పడియున్నవారిని
అవే బహుశా మేల్కొల్పవలె.

## 18

# వలపు తునుకలు

నా విధ్వంస దృశ్యము
వీక్షించుటకు ఉపయుక్తముగ ఉన్నది
నా సమ్ముఖముననే
అది ఎందులకైనదో, ఎట్లా వచించేవి ?

ఏ ఆసక్తి, అభిలాష ఆనందములో
వికసింపగలవు?
నా రెండు మూడు నాళ్ళు.
ఎవరైనా నన్నే కోరుకొన్నచో-

అయ్యో ! అజ్ఞానుడా ! జీవిత మంతా
ఈర్ష్యాళువుగ ఉంటివి.
నా రహస్యముల నెరిగిన
ప్రత్యర్థికి నా ప్రేమగుట్టు తెలిసియుండెను.

ఇక్బాల్ ! నీ ప్రస్తావన
ఎప్పుడైన వచ్చినదా ?
నీ సంభాషణ తీరులో ఏదైనా
ఇంద్రజాల ప్రభావ ముండినదా ?

దర్శన కుతూహలములో
నీ నయనములు వికసించినవా
ప్రేయసి పోవు దారిలో
ఉన్మాద మెత్తించే అడుగు జాడల చూడు.

ఆమె నన్ను అపార్థము
చేసికొన్నదని తలచుటకు వీలులేదు
నన్ను నేనే దూషించు కొంటినే
నా చర్యల తలపోసికొని.

నిండు గోష్ఠిలో
నా రహస్యపు మాటలు చెప్పివేసింది
మూర్ఖముగా ప్రవర్తించినాను
శిక్షించమని వేడుకొనుచున్నాను.

చాల వింతగ నున్నవి
మతోపదేశకుని చర్యలు.
సాయంకాలపు నమాజ్ కేకతో
గజగజ వణకి పోతాడు.

హిందూస్థానము నుండి
జోరైన వడిగాలి వీయాలి
అరేబియా మార్గపు ధూళిలో
నన్ను లేవనెత్తి పడవేయాలి!

ఈ ఉద్యాన వనములో
హృదయ విహంగము
స్వాతంత్ర్య గీతముల పాడలేదు.

అయ్యో ! ఇది తోటకాదు,
అట్టి పాటలు పాడుటకు.

19-6-89
నెల్లూరు.

# నందన వనము

(ఇక్బాల్ ప్రశంస)

'సమస్త జగత్తులో మెరుగైనది హిందూస్థానము
మేము కల స్వనముల విహంగములము
అది మా నందన వనము'
అని కవిచంద్రుడు ఇక్బాల్ ఏ నాడు నుతించెనో
జన్మభూమిని పలువురు పలు విధముల
ఊహించిరి, కీర్తించిరి.
ఉర్దూకవి నందనమని ఏ తన్మయత్వమున
పులకితాంతరముతో పాడెనో !
వనమున ఎన్ని రమ్య దృశ్యాలు,
ఎన్ని ఋతుశోభలు, ఎన్ని వర్ణములు, ఎన్ని సౌరభాలు !
ఎంత కవితాత్మకమగు ఉపమానము !
పూలతోట ఏకజాతి ప్రసూనములతోనే
కొంగును నింపుకొనవచ్చును.
మల్లెలు, గులాబీలు, చేమంతులు, బంతి పువ్వులు
రకరకములైన రంగులతో
సమస్త పుష్ప ప్రపంచము
మనోహరముగా కాన్పింపవచ్చును.

పుష్ప సంగీతము ఏకస్వర తంబూరా కారాదు.
శత తంత్రుల విపంచి కావలెను.
సంగీతము భిన్న స్వరముల సమాహారము.
సౌరభ సౌదామినుల దీప్తి ధామము.
కలయికల కూర్పులు, మార్పులు
తగ్గింపుల స్వర స్రవంతుల ప్రయాగ.
అదే కవి కల్పన, మనోజ్ఞ ఊహ
శబల భావ మంజరి !

భౌగోళికముగ సమీక్షించిన
ఎన్ని భిన్నత్వాలు !
ఉన్నత గిరి శిఖరాలు ఎచ్చట కలవు
కరగని మంచు వేల ఏండ్లుగ
ఎచ్చట పుంజీభూత మాయెను.
సాంద్ర అరణ్యములు, ఎడారులు నదీ తీరాలు
మూడు సముద్రాల పులిన తీరాలు.
ఉదయించే సూర్యబింబమును దర్శింపే తరంగాలు
క్రుంకే రవికి నమస్కరించే కిమ్మీర సాగర వీచికలు.
అర్కునికి సుప్రభాతాలు పాడే సాగరికలు
జోలపాటలు పాడి నిద్రపుచ్చే
సింధు కుమారీ కంఠాలు
ఒక చోటుననే అమిరాయి
ఎక్కువగ వర్షించే చిరపుంజీ పర్వత శిఖరాలు
మరెచ్చట దిగంత కపోలాల ముద్దిడగలవు ?

ఎన్ని మతాలు, ఎన్ని ధర్మాలు
దేవుని ఎన్ని విధముల స్మరించేవారు
ఎన్ని రీతుల ధూప నైవేద్యాలు.
అరూపుని రూప వేషములతో అలంకరించెదరు
నామ రహితుని ఎన్ని నామములతో స్తోత్రించి
జపమాలల త్రిప్పెదరు
ఎన్ని ధర్మాలు ఏక కుటుంబముగ
సహజీవనము చేయగలవు !
పూర్వదిశకు మళ్ళి నమస్కరించువారు
పశ్చిమదిశకు వంగి ప్రార్థనలు చేయువారు
పూర్వజన్మ లేదనువారు
ఉన్నదని విశ్వసించువారు
ఏక దేశ కీర్తికి వారసులై మనగలరు ?
సిక్కులు, జైనులు, అగ్ని పూజాపరులగు పారసీవారు
మన ప్రత్యేకత ! ఈ తోటలోనే ఉన్నవారు.
ముస్లింలు, క్రైస్తవులు, బౌద్ధులు
ఇతర దేశములలోను వసించు వారే
పేరు మాత్రము హిందూస్థానము
అన్ని మతాలకు ఉయ్యేల, వాసస్థానము
మతాలు వేరు, దైవము ఒక్కడే !
స్వరాలు వేరు, సంగీతబ్రహ్మ ఒక్కడే !
పువ్వులు వేరు, తోట ఒక్కటే !
తోటలో అట నట ముళ్ళకంచెలు ఉన్నాయి

కులాలు ఉన్నాయి, అస్పృశ్యులు ఉన్నారు.
నిజమే ఇది శాపప్రాప్తమైన గ్రహణమే.
గ్రహణము పౌర్ణమికే పట్టేది. త్వరలో తొలిగేదే !

ఎన్ని భాషలు ! ఎన్ని రకాల పిట్టలు
తమ జిలిబిలి పలుకులతో
వనాన్ని రోమాంచిత మొనర్చేవి
ముద్దు పలుకులతో మేల్కొలిపేవి
వికసించిన భాషా ప్రసూనాలు
మొగ్గలుగ నున్న గిరిజన భాషలు
అన్నీ వన శోభను పెంచేవే
భాషల భాష సంస్కృతము
వేద రుక్కుల ఘోషించింది ఇచ్చటే
పాళిలో సంఘం శరణం గచ్ఛామి
అని కీర్తించింది ఇచ్చటే !
సాగర తీర భాషలు, హిందీ-ఉర్దూ
కంఠహారాలుగ వెలసినది ఈ క్షేత్రముననే.
ద్రావిడ భాషలు ప్రత్యేకతతో వర్ధిల్లింది
దక్షిణ ప్రాంతాలలోనే.

ఎన్ని భాషలో దాదాపు అన్ని లిపులు.
ఎంత అక్షర రమ్యత, ఎన్ని సాహిత్యోత్సవ దీపాలు
సకల భాషా దళాలు విచ్చితేనే

సమగ్ర సంస్కృతీ సౌరభాలు విస్తరిల్లేది.
భారత వియత్తలము
రమ్య కాంతిపుంజములతో మెరిసేది.
ఎన్ని సంగీత పద్ధతులు.
స్వల్ప వ్యత్యాసములతో రస సుధా ధారలు
నాదబ్రహ్మ పాదాభిషిక్తము చేసే
స్వర ధునీ శీకరాలు.
కిన్నరులు, గంధర్వులు ఈర్ష్యపడే
శ్రావ్య సంగీత స్వర సౌభాగ్యాలు.
జానపద గేయాల తియ్యని దరువులు
శాస్త్రీయ మేళకర్తలు, జన్యరాగాలు
ఎన్ని తాళ విశేషాలు, ఎన్ని వాద్యాలు
అపార సంగీత పారావారము
పొంగిన పుణ్యభూమి !

ఎన్ని నృత్య పాద విన్యాసాలు
హస్తముద్రలు. నయన సంచారితాలు
భ్రూ విక్షేపాలు, మానవ శరీరము
ఎన్ని వంపులతో కుదింపులతో
గతి విశేషాలతో, పాదతల తాళవ్యత్యాసాలతో
నటరాజుకి మోదము కూర్ప గలవు
ఆదిమ జాతుల సహజ సరళ నృత్య పరిభ్రమణాలు
పంజాబీల పౌరుష బంగడో వినోద దరువులు

రాజస్థాన్ చిత్రనృత్య తమాషాలు
మణిపుర లలిత మనోజ్ఞహస్త విశేషాలు
కథకళి నాటకీయ అభినయ నృత్యాలు
కథక్ రమ్య లయలు, గజ్జెల గుసగుసలు
భరతనాట్య, కూచిపూడి, ఒడిస్సీలలో
రమణుల రమణీయ శిల్పమూర్తులు
స్తంభించిన లాస్య లావణ్య లహరులు
ఋతువులే నారీరూప శోభలై వెలసెదరు.
చంద్రకళలే ఊర్వశులై
కళాంబుధి తరంగిత మొనర్చును.
సౌందర్యమే కళయై
హృదయ డోలికలమీద ఊగునో,
స్వప్నస్మిత సుందరులు జీవకళాపరాకాష్ఠగ
మెరసెదరు !
ఎంత నైపుణ్యము, ఎంత తారతమ్యము
శరీరాంగముల గుప్త కళావిలాసాలు

భిన్న ఆకారాల కట్టడాలు,
అపూర్వ శిల్పవైభవాలు
శిలలు శిల్పస్పందన పొందాయి.
శిలలు కళామంజులలై ప్రస్ఫుటించి
మందస్మితాల క్రుమ్మరించాయి.
తాజ్‌మహల్, ఎల్లోరాలు జగత్ప్రసిద్ధాలు

దిల్‌వారా అబూ జైనమందిరాలు
మధుర, రామేశ్వర దేవాలయాలు
స్వర్ణ గురుద్వారాలు. గోవాలోని చర్చీలు
విశాల మసీదుల ప్రాంగణాలు,
ప్రపంచ విస్మయ వినోదాలే!

కళాసౌరభాలతో గుబాళించేవే !

శతాబ్దాల శాస్త్రీయవైభవాలతో
ఆధునిక విస్మయ నయనాలకు కనువిప్పు కలిగించేవే
ప్రాచీన సభ్యతను స్మరణ కౌగిలిలో చేర్చేవే
ఆగామి శతాబ్దాల సభామండపాలలో
శిలా శిల్పకరాలు గంటలు మ్రోగించేవే
ఎన్ని రకాల అభరణాలు, చీరకట్టులు
ధోవతికట్టులు, పైజామాలు !
కాశ్మీరులో వేషము వేరు

కేరళలో, అస్సాంలో వేరు
శీతోష్ణాదులకు తగిన మార్పులే !
ఆహారాలు వేరు, తినుబండారాలు వేరు
అన్నం తినువారు, రొట్టెలే తినువారు
చేపలు తినే బ్రాహ్మణులు, ఉల్లి కూడా ముట్టనివారు
ఎన్నిరకాల రుచులు, మధురిమలు !

ఆధునిక నగరాలు
యుగాలు మారని మన్యప్రాంతాలు

పాతక్రొత్తల కలయికలతో
శతాబ్దాల సహజీవన సమ్మేళనలతో
ఎన్ని ఆచారాలు, ఎన్ని సంప్రదాయాలు
ఎన్ని వ్యత్యాసరూపాలు !
చెట్లు వేరే వేరే
కాని తోట ఒక్కటే !
వేళ్ళను బిగించుకొని, ఊడల దింపుకొని
కొమ్మల ఎత్తుకొని ఎన్ని అందమైన చెట్ల వరుసలు
మెత్తని చిగురులు, విచ్చని మొగ్గలు, చక్కని పువ్వులు
రకాల రంగులు, హాయిని కూర్చే వాసనలు
విపిన చైత్రపవనాలు, శ్రావణ మేఘాలు
జ్యోత్స్నావిహ్వల రజనులు
అరుణ ప్రభాతాలు, సంధ్యలు
మన స్వప్నసీమ, సువర్ణభూమి
పుణ్య వసుంధర, వందే మాతరం
అదే మన హిందూస్థానము
అదే మన పువ్వుల తోట
అదే మన ఆనంద నందన వనము
కల కంఠముల శకుంతములము మనము,

సారే జహాఁసే అచ్ఛా హిందూస్థాన్ హమారా
హం బుల్‌బులే హైఁ ఉసీకా
యే గుల్ సితాఁ హమారా
అమర్ హో హింద్ హమారా
జిందాబాద్ వతన్ హమారా

19-5-86
మద్రాస్.

# అల్లామా ఇక్బాల్ కవితలు

తెలుగుసేత

బెజవాడ గోపాలరెడ్డి

